# గీతాంజలి



స్వేచ్ఛానువాదం :

యన్. వి. రామానుజాచార్యులు, బి.ఏ., బి.ఇడి.,
రైల్వే మిశ్రమోన్నత పాఠశాల,
చిట్రగుంట

ప్రతులు - వెయ్యి
ప్రమాదీచ - భాద్రపదము
సెప్టెంబరు - 1973



GEETHANJALI
*By*
N. V. RAMANUJACHARYULU

మూల్యము : మూడు రూపాయలు

ప్రతులకు :-
మారుతీ బుక్ డిపో,
మెయిన్ రోడ్,
గుంటూరు - 3

# కే ల్మో డ్పు

సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్.



సకల లోక నుత ప్రబావుడు
సరస కావ్య కళావిలాసుడు
విశ్వకవి యనౌ 'రవీంద్రున'కు న
మస్సు లర్పింతున్.

— రచయిత

# స్మృతి సుమాంజలి

నా అగ్రజులు, పరార్థప్రాపకులు,

మధుర హృదయులు, మాన్యచరితులు

స్వర్గీయ పోలవరపు సత్యనారాయణగారి

స్మృత్యర్థము

## 'గీతాంజలి'

ప్రచురింపబడినది.

అనుగు తమ్ముడు

పోలవరపు జగదీశ్వరరావు, M.A., LL.B.,

ఆంధ్ర విశ్వకళాపరిషత్ సిండికేటు సభ్యుడు,

ప్రిన్సిపాల్,

వి ఆర్.యస్. అండ్ వై.ఆర్.యన్. కళాశాల,

చీరాల

అ మ ర జీ వి



పోలవరపు సత్యనారాయణగారు 1926-1971

# చరితార్ధులు

సిరులు విరిసిన ఆంధ్రదేశము
నందు కృష్ణా మండలమ్మున
'అంగలూర'ను జనపదమ్ము ప్ర
శస్తి గాంచెనుగా.

సత్యధర్మ పథాన మెలగుచు
నిత్యమును పరహితము గోరెడు
రైతుబిడ్డలు కలరు బహుముఖ
ధీవిరాజితులై

వారిలో గ్రామాధికారులు
మేలి గుణములు గల మనీషులు
'పోలవరపు' కులీను లనుపమ
గుణవిశారదులై

చేయి జాపిన నాస్తి యనరు వి
శాలభావము గలుగు వారలు
సమసమాజ హితార్థులై యశ
మందినారుగదా.

వరపురంధ్రి 'సరస్వతమ్మ' ప
రసుడు 'సీతారామయా'ఖ్యుల
నోము లెల్ల ఫలింప గల్గిరి
సుతులు మువ్వురుగా

తల్లి కన్న దయార్ద్రమతియై
యుల్ల మంతయు పల్లవింపగ
బాల్యమున 'చిలకమ్మ' పెంచెను
మమత వెలయంగా.

వారి తోబుట్టువు 'ప్రభావతి'
వైద్యవిద్యాపట్ట మంది ప్ర
శస్తుడౌ 'జగదీశచంద్రుని'
గృహిణియై యలరెన్.

వినయ సౌజన్యములు పెనగొన
చదువుసంధ్యలు నేర్పి జననీ
జనకులకు సంబరము గూర్చిరి
సుగుణ భూషణులై

వారిలోపల 'సత్యనారా
యణ సుధీమణి పెద్దయై వం
శప్రతిష్ఠకు మెఱుగు దిద్దె స్వ
ధర్మ రక్షణతో

కార్యదక్షుడు దేశభక్తుడు
సహజనటనాకుశలు డాతడు
భక్తితో దేవళము మైసూ
రున వినిర్మించెన్

పొల్లు మాటలు లేవు కల్లా
కపటములు లేవతని యెదలో
మంచిగా సరివారిలో జీ
వింప గోరెగదా

అతడు యల్.సి.ఈ. గ నుద్యో
గించి గాంచె యశమ్ము దండిగ
కన్ను గుట్టైను దుర్విధికి నా
తని ప్రశస్తి గనన్.

# 4

ముదిమి వెలుగని మోహనాంగుని
గదిసె మృత్యువు కఠినమతియై
ఏబదేండ్లును నిండలే దెటు
నూరు నిండినవో

దాని నొక పీడకలగా బాం
ధవులు సోదరు లెదల నడలిరి
భ్రాతృహృదయము శాంతినొందు ను
పాయ మెద్ది యనన్.

'సత్యనారాయణ'కు తమ్ముడు
మధురహృదయు డదృష్టవంతుడు
అన్నిటను తన యన్నవోలె వి
శిష్ట మానసుడే.

సరససాహితి యన్న మురిసెడు
భావుకుడు 'జగదీశ్వరుడు' గీతాం
జలి'ని తన అన్న స్మృత్యు
ర్థముగ ప్రచురించెన్.

సఖుడు 'రామానుజాచార్యులు'
మధురమంజులశైలిలో 'గీ
తాంజలి'ని తెలిగించె ముత్యా
లసరముల తోడఁ.

శాంతి నందును గాత స్వర్గీ
యుని మనమ్మా కృతిపై గాంచుచు
వెలయు నీ కృతి నిలిచి నా చం
ద్రార్కముగ భువిలో.



'జయన్తి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే
జరామరణజమ్ భయమ్.'

Prof. T. DONAPPA
Professor of Telugu
Andhra University

17-B, Sea Sands
University Campus
Waltair

ఆగస్టు 13, 1973.

జనంమెచ్చిన రవీంద్రుని గీతాంజలికి తెలుగులో అనువాదాలు అనేకం వచ్చాయి. ఎవరికి నచ్చిన తీరులో వారు తెలిగించారు. ముఖేముఖే సరస్వతీ! వాటిలో ఇదొకటి. మూలభావాలను ముత్యాల సరాలలో పోహళించటం ఇందలి ప్రత్యేకత. కర్తా, కారయితా అభినందనీయులు.

తూమాటి దొణప్ప

# పుష్పాంజలి

నేను చదివిన గ్రంథాలలో విశ్వకవి రవీంద్రుని గీతాంజలి నన్ను ఎంతగనో ఆకర్షించినది. అందలి కవితా తత్త్వము అట్టిది. భావన చేసినకొలది దానిని అనువాదము చేయవలెనను కోరిక కలిగినది. కాలక్రమేణ అది స్థిరపడి జీవితాకాంక్ష యైనది. వృత్తముల నుపయోగించి అనువదింప బూనగా వ్యర్థపదాలు కొల్లలుగా దొర్లినవి. ఆ కారణముచే ముత్యాలసరాల నుపయోగించితిని.

వంగభాషయందు అభిమానము కల్గించుటలోను అందలి శబ్దమాధుర్యమును భావసౌకుమార్యమును విపులీక రించుటలోను కలకత్తా నివాసి డాక్టరు నీరద బిరణదాస్ (బిట్రగుంట రైల్వే వైద్యాధికారి) గారు తోడ్పడినారు.

రచనలో తగు సలహాలు ఇచ్చిన శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారును, అభిప్రాయము లిచ్చిన శ్రీ సంజీవదేవ్ గారును, ఆంధ్రవిశ్వకళాపరిషత్ తెలుగు ప్రొఫెసరు డాక్టరు తూమాటి దొణప్పగారును అభివందనీయులు. అను వాదమును ఆద్యంతము పరిశీలించి మెఱుగులు దిద్దుటలో సర్వ విధముల సహకరించి నా రచనకు జీవము పోసిన సహృద యులు చీరాల వి.ఆర్.యస్. అండ్ వై.ఆర్.యన్. కాలేజి తెలుగు లెక్చరరు శ్రీ ప్రతాప వెంకట సుబ్రహ్మణ్యంగారికి కృతజ్ఞుడను.

'అన్నీ ఒకయెత్తు అగస్త్య డొకయెత్తు' అన్నట్లు గ్రంథ ముద్రణ భారమును వహించుటకు నా బాల్యమిత్రులు చీరాల

V.R.S. & Y.R.N. కళాశాల అధ్యక్షులు సరససారస్వత సమర్చనాసక్తులు శ్రీ పి. జగదీశ్వరరావుగారు పూనుకొని నిర్వహించుట నా మహాభాగ్యము. వారు తమ అగ్రజులు, సార్థక జీవనులు మధురభావనులు స్వర్గీయ పోలవరపు సత్యనారాయణ గారి స్మృత్యర్థము నా 'గీతాంజలి'ని సర్వాంగసుందరముగా ముద్రింపించినారు. నిజముగా ఈ సంఘటన నా జీవితమునకు సార్థకత గూర్చినది.

'సుకృతీ గతాయుః' అన్నట్లు కీర్తిశేషులు సత్యనారాయణగారు సుకృతి యగుట నీ కృతి నందుకొని ఆత్మశాంతితో యథార్థముగా కీర్తిశేషులై, అపునర్భవత్వ సిద్ధి నందుదురు గాత.

ఇట్టి రచనకు చాలినంత పాండిత్యము అనుభవము లేకున్నను కేవలము ఉత్సాహముతో సాహసించి 'గీతాంజలి'ని ముత్యాలసరాలలో కూర్చిన నన్ను ఆశీర్వదించిన మిత్రులకు పెద్దలకు మరొకసారి కృతజ్ఞతాభి వందనములు.

రవీంద్రుని గీతాంజలికి నా హృదయ పుష్పాంజలి.

యస్. వి. రామానుజాచార్యులు.



# వీక్షణ

రవీంద్రుని గీతాంజలి వాస్తవ లోకానికీ కల్పనా లోకానికీ మధ్య ఒక సేతువును నిర్మించింది. విశ్వకవి లాగా అనువాదకులు శ్రీ యస్. వి. రామానుజాచార్యులుగారు కూడ తమ రచనలో సరళ పదాలనే వాడారు.

గీతాంజలిని ఎందరో ఎన్నో భాషలలోనికి అనువదించారు. తెలుగులోకూడ చాలా అనువాదాలు వచ్చాయి. అయినా అన్నీ ఒక రకంగా లేవు. ఎవరి ఉపజ్ఞ వారిదే.

వీరి అనువాద కవిత మృదు మధురంగా వుంది. మచ్చునకు

"Thy Sunbeam comes upon this earth of mine with arms out stretched and stands at my door the live long day to carry back to thy feet clouds made of my tears and sighs and songs.

"సూర్యరశ్మి మదీయ గేహ క
వాటమున దినమెల్ల గడపె వి
షాదకంకణ గాన మేఘా
వళుల నీ కీయన్."

మూలానికి ముత్యాలసరం ముచ్చటగా వుంది. భావాలు రవీంద్రుని వైనా పరభాషలోకి యధాతధంగా తేవటం సులభం కాదు.

జీవించట మంటే జనానికి దూరంగా సర్వత్యాగం చేసి బ్రతకటం కాదు. జీవించటమే ముక్తికాని మరణించటం కాదు. జీవన్ముక్తి సర్వులకూ ధ్యేయం. మనచుట్టూ వున్న వ్యక్తులూ, వస్తువులూ మనకు బంధనాలు కాకుండా వుండాలి. అప్పుడే మనకు స్వేచ్ఛ. స్వేచ్ఛాగీతాల అంజలియే గీతాంజలి.

తన చిర ప్రియతమకు ఆత్మార్పణం చేస్తే తన్మయత్వం కలుగుతుంది. ఈ అనుభవం సంపాయించడానికి ప్రతిభావ్యుత్పత్తులు అక్కరలేదు. తర్కాలు తత్వాలు తెలియనిలేదు. అంతశ్శుద్ధీ ప్రేమానురక్తీ వుంటే చాలు.

ప్రకృతి శోభలో చిరప్రియతమకై జీవితాన్ని అంకితం చేయడం కన్న ఆనందం లేదు. ప్రేమికుడు ప్రియతమను చేరు సన్నివేశం అంతంలేని ఆనందదాయకం. ఈ ఆనందాన్నే గానం చేస్తుంది "గీతాంజలి",

యువకులూ ఉత్సాహవంతులూ అయిన శ్రీ. యన్. వి. రామానుజాచార్యులుగారి ముత్యాల సరాలు ఎంతో మనోహరాలుగా వున్నాయి. వారు అభినందనీయులు.

సంజీవదేవ్

# సుహృదభినందనము

విశ్వకవి – రవీంద్రుని గీతాంజలికి శ్రీ యస్. వి. రామానుజాచార్యులుగారు చేసిన అనువాదం మృదు మధుర మనోజ్ఞంగా ముత్యాల సరాలుగా తెలుగులో వెల్లివిరిసింది.

తెలుగువారి కవితాభిరుచి – హాలమహాకవి సంతరించిన గాధాసప్తశతినాటినుండి – "ధ్వని" – ప్రధానమైన సుకుమార సుందర భావోన్మీలనమే.

గీతాంజలి ––

"అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ"

అనే ఉపనిషత్సంగీతమునకు శ్రుతి కల్పుతున్న ఉజ్వలకవిత.

తమస్సు – అంటే కేవలం చీకటి అని అర్థం చెప్పితే– కవి హృదయానికి అపచారం చేసినట్లే. జ్యోతి - జ్ఞానానికి - ప్రగతికి మార్గదర్శకమైన విజ్ఞానానికి ఒక ప్రతీక.

గీతాంజలిలో వినిపించే వేణువు వెదురుముక్క కాదు.

సంగీతవిద్వాంసుని చేతిలోని మురళీ కాదు.

ప్రేపల్లెవాడలోని ప్రతి గోపిక – గీతాప్రవక్త పెదవి దరిజేర గలిగిన పిల్లనగ్రోవిగా మారిపోవాలని చెందిన తహతహ

గీతాంజలిలోని కవితకు అంతరాత్మ. అనువాదకులు- గీతాంజలిలోని కవితా సౌందర్య మాధుర్యములను తెలుగు వారికి అనుభవ పునరుక్తం చేసినారు.

విశ్వవిఖ్యాతిని ఆర్జించి – ప్రపంచములోని సహృదయులు పులకాంకురప్రకరాలతో సమర్పించిన కర్పూర నీరాజనం అందుకున్న కవితాకృతి – గీతాంజలి.

గీతాంజలిని అనువదించటం అభినందింపదగిన కృషి. కృతి ప్రదానం తెలుగువారి విశిష్ట సంప్రదాయం.

ఈ కావ్యం స్వర్గీయ శ్రీ పోలవరపు సత్యనారాయణ గారి ఆత్మకు ఉత్కృష్ట బహుమానం. దీనిని అందించిన ఆత్మీయులకు నా సుహృదభినందనములు.

అన్నగారి పేరు – ఆంధ్రవాఙ్మయంలో చిరస్థాయి చేయాలని సంకల్పించిన సోదరుడు శ్రీ జగదీశ్వరరావు – కవులందరకూ – ముఖ్యంగా నాకూ సహోదరుడే.

ధనం కవిత్వంకోసం వ్యయం చేసినవారు – ధన్యజీవులు.

— నండూరి రామకృష్ణమాచార్య

# గీతాంజలి



## 1

దివ్య నవజీవనము సతత మ
నశ్వరమ్మగు పాత్ర నించియు
న న్ననంతుని జేసినాడవు
మోద మది నీకుఁ

వెదురువేణువు భవత్కరమున
కొండకోనల వనుల దిరుగుచు
మధుర మృదుతర గీతికారవ
మాలపించెనుగా

పావకమ్మగు మృదుస్పర్శకు
పొంగి పొరలిన నాదు హృదయము
పరవశమ్మగు సంతసమున న
లేఖ్యభావనతో

యుగయుగమ్ములు గడిచి చనియెను
నీ యనంత వరప్రదానము
నాదు దోయిలి స్వీకరించుచు
నుందు ననిశమ్ముఁ.

## 2

గాన మాలాపింప నాజ్ఞకు
గర్వమందిన నా యెడందయె
ప్రీలినట్లయె గాని నిన్ గని
రాల్చె నశ్రువులన్

నా యపశ్రుతు లెల్ల కరిగెను
మేళవించె మధుస్వరమ్మున
రెక్క లార్చెను ఖగము పగిదిని
వనధి దాటంగన్

నే నెరుంగుదు నీ ముదమ్ము మ
దీయగానమునందు నేటికి
గాయకునిగా మాత్రమే నీ
మ్రోల నిలిచితిగా

నీ పదమ్ము స్పృశించు భాగ్యము
దుర్లభమ్మని వెల్లివిరిసిన
మధురగీతాంచలము ముదమున
నే స్పృశించితినే.

గానమాధుర్యమున స్వవశత
వీడి నన్నే నేను మరచితి
నిన్ను ప్రియసఖుఁడంచు పిలిచితి
నపుడు నా స్వామీ !

## 3

సతము సమ్మోద సంభ్రమమ్ముల
నీదు గానము మౌనముద్రమ
వినుటెగా నీ వెటుల పాడెదొ
నే నెఱుంగ ప్రభూ!

ద్రిమ్మరిలె వాకాశసీమ త్వ
దీయగానపు జీవగీతిక
మధురగానామృత ప్రకాశము
జగతి వెలిగించెఁ.

నీ పవిత్రపు గానవాహిని
యడ్డు దగిలిన గండశిలలను
స్వేచ్ఛతో పెకలించి ముదమున
పర్వు లెత్తునుగా

నీదు స్వరమున ముదముతో శ్రుతి
గలుపగా చిరకాల వాంఛిత
మిప్పటికి నవశ్రుతుల తోడనె
వ్యర్థ మాయెనుగా

పలుకుచుందును మాటిమాటికి
శ్రావ్యరహితమ్మాయె భాషయు
నరచితిని గానామృతముకై
తత్తరముతోడ జా

తావకమ్మగు దివ్యగానా
మృతమ్ముకై నా లలితహృదయము
పరవశమ్మయిపోయె నెంతయొ
చిత్రముగ స్వామీ!

4

దివ్యజీవస్పర్శ నిరతము
నాదు తనువున నుండు తెరిగియె
నిర్మలమ్ముగ నుంతు ననిశము
బహిః ప్రాణముకై

తత్వ దీపిక మన్మనమ్మున
ప్రజ్వలింపగ జేసితివి నే
తలపనైతిని సూనృతమ్మును
తలపునందైనఁ

హృదయ కుసుమ పవిత్రపీఠము
త్వన్నివాస మ్మగుటచేతను
ప్రేమమీరఁగ నిర్మలమ్ముగ
నుంతునో స్వామీ !

నీ యనంతమ్మగు బలమ్మే
శక్తిదమ్మని క్రియల నెల్లను
త్రికరణమ్ముల నివేదించుటె
నా ప్రయత్నమ్మౌ.

## 5

నీ పదమ్ముల సన్నిధిని తృటి
వినోదింపగ నాజ్ఞ వేడెద
నాదు కర్తవ్యమ్ము నావల
నిర్వహింతునుగా

దివ్యముఖ సందర్శనమ్మే
లేనియెడ నా లలితహృదయము
విశ్రమింపదు కార్యభార మ
పారసాగరమౌ

నా గవాక్షము చెంత నామని
యూరుపులు గుసగుసలు వినునెడ
భృంగములు ఝుమ్మంచు పాడెను
మధుర సుమవీధిఁ.

ఇదియె సమయ మ్మిచట తావక
దర్శనమ్మగు శాంతసమయము
జీవితము నంకితము చేయగ
పావకాశముగఁ

6

కోసికొమ్మా చిన్న కుసుమము
స్వీకరింపుము శీఘ్రముగ నీ
వాలసించిన ధూళిపాలగు
ననుచు భయపడుదుఁ.

మాల నుంచగ వీలు పడదని
బాధ నందగ వలదు కరమున
కోసికొమ్మా చిన్న సుమమును
గౌరవముతోడన్.

పూవు గోయక దినము గడిచెను
పుణ్యకాలము తరలి చనునెడ
సర్వ మెఱిగిన నా మన మ్మిక
తత్తరము జెందున్

పరిమళాకర్షణలు లేశము
తగ్గినను కుసుమమ్ము గొని నీ
పాద సేవకు నియోగింపుము
మంచి తరుణమునన్.

## 7

మామకమ్మగు మధురగీతము
వ్యర్థ సౌందర్యమును వీడెను
శైలిలో గమకాలలో గల
గర్వమును వీడెన్

కింకిణీ మృదురవము నీ హృది
వర్మభాషణ వినగ నీయదు
ఐక్యమున కాభరణములు పత
మంతరాయములౌ.

నేనె కవినని గర్వ మందితి
కాని నిన్ గని సిగ్గు జెందితి
నీ పదమ్ముల మ్రోల నిలిచితి
నోయి కవి తిలకా!

జీవనము ఋజువర్తనమ్మున
మురళివలె వే నుంతు ననిశము
నింప వేడెద వేణువున నీ
దివ్యగానముతో

8

హేమమాలలు జిలుగు దుస్తులు
బాలక్రీడకు ముదము నీయవు
అనిశ మంబగ భూషణావళు
లంతరాయమ్మౌ.

జిలుగు దుస్తులు మలిన మగునని
చినిగి చెడునను వెరపుతోడుత
సఖుల వీడెడి బాలకుడు తా
గదల భయమందుꣳ.

దివ్యమానవ జీవనోత్సవ
ధూళిరహితమ్మైన జీవికి
హేమమాలల సౌఖ్య మంతయు
స్వర్ణపంజరమౌ.

9

స్వీయభుజమున నీ శరీరము
నెటుల మోసుకపోవ గలిగెదు
బిచ్చ మెత్తుదు నీ గృహమ్మున
జ్ఞానరహితుడనై.

విశ్వభరము వహించు కరమున
సర్వభారము వదలి వేయుము
తలపు లన్నియు వీడి యిక ని
శ్చింతగా మనుమా

తాపకమ్మగు శ్వసితకామపు
మలిన దృష్టికి తాళజాలక
ప్రమిదలో గల జ్యోతి సత్వర
మారిపోవుగదా !

స్వీకరింపకు దివ్యవరముల
మలినకర మపవిత్ర పరచును
స్వీకరింపగ రాదె నిర్మల
ప్రేమ హృదయముతో

## 10

ఇచట నీ పద పీఠ మున్నను
నీదు మృదుతర పాదయుగళము
పతిత జీవులు మసలు తావున
నొందు విశ్రాంతిన్

పతితదీన లనాధ జీవుల
మోల నిలిచిన నీ పదమ్ముల
జాడ దెలియగ లేదు నానతి
యత్న మెంతైనన్

దీనదృక్కుల నున్న పేదల
మధ్యమలిన కుచేలములతో
నడచు నీ సన్నిధిని జేరదు
నాదు గర్వమ్మె.

నిస్సహాయత నున్న దీనుల
పతితజీవుల కీవు దోహద
మొసగు మార్గ మ్మెరుగు దెపుడు మ
దీయ హృదయమ్ముఽ

## 11

ఆపుమాపుము నీదు జపమును
ఆపుమీ నీ భజన కీర్తన
లాపుమీ రుద్రాక్షమాలల
మంత్ర గణనమ్ముఽ

ద్వారములు బంధించి సతతము
దేవళాన నుతింతు వెవరిని
కనులు దెరచిన కానరాడట
నీదు దైవతమూ

కర్షకులు శ్రమజీవులును మలి
నంపు దుస్తుల యెండవానల
క్రుగ్గుచుండెడి చోట స్వామి కు
చేలముల నుండెన్

జపతపాలకు స్వస్తి జెప్పుదు
దైవదర్శన భాగ్యమునకై
ధూళి నిండిన నేల మీదికి
రమ్ము వేగముగన్

మోక్ష మనునది యెచట నున్నది ?
సృష్టి బాధ్యతతోడ దైవము
ముదముతో బంధింపబడెయును
సతము మనతోడన్

విడుము ధ్యానము ధూపదీపాల్
మలినమైనను నీదు దుస్తులు
చెమట బిందువు లోడ్చి దైవము
గొలువ రమ్మిటకున్

## 12

నా ప్రయాణ మనంతమైనది
దాని కాల మ్మంతు లేనిది
ఇట్టి యాత్రల జేయు మార్గ మ
నంతమే సుమ్మీ

శాంతిరథమున బయలుదేరితి
గగన గహనమ్ములను లోకా
వళుల గడచిన చిహ్నములతో
ననుగమించితినే

ఆత్మసన్నిధి జేరు మార్గమె
అధికతమమగు దీర్ఘయానము
పరశమంజుల గాత్ర శిక్షణ
క్లిష్టమే సుమ్మీ

స్వీయగృహమును జేర పథికుడు
పరకుటీరము దాటు విధమున
గ్రుమ్మరగ వలె లోకములు ది
వ్యాలయము వెదుకగ

నయనములు దిశలెల్ల వెదకియు
వేసరిల్లెడు సమయమందున
నన్ను చకితుని జేసె నిట భవ
దీయ దర్శనమే

ఎచట నీవను నాదు ప్రశ్నె
మ్మిచట నేనను అభయ మొకటై
జాలువారిన బాష్పధారకు
జగతి ప్రళయమౌ

## 13

పాడ నెంచిన మధురగీత
మ్మాలపింపగ లేద యింకను
వీణియను సరిజేసి కాలము
వ్యర్థ పరచితినే

కాలమా ప్రతికూల మాయెను
కవనమా సరిలేక పోయెను
వేదనాభర మధిక మాయెను
పాడవలె ననుచు

ఇంత కాల మ్మొఝో, గానీ
పుష్పమే వికసింప దాయెను
వీచుచున్న సమీర మొక ని
ట్టూర్పు విడిచినదే

మోము గాంచగ లేదు కంఠ
స్వరము విననే లేదు నా గృహ
ప్రాంగణమ్మున నతని పదముల
రవళి వినియుంటిఁ.

దినము సర్వము ముగిసిపోయెను
ఆసనాలంకరణ శోడనె
ప్రమిద వెలిగింపకయె స్వామిని
నెటుల రమ్మందుఁ.

అతని పొందును గోరి యాశను
బ్రతుకు ప్రొద్దులు బుచ్చుచుంటిని
ఇంతదనుకను లేదు ప్రాప్త
మ్మతని నేస్తమ్ముఁ

# 14

నాదు కోర్కె లనేక మైనను
జాలి గొలిపినగాని నా మొర
వినుచు నను రక్షించు చుంటివి
తిరస్కారముతో

నీ యపారమ్మైన కరుణకు
నాదు జీవము పాత్రమగునటు
చిత్రముగ సమకూర్చితివి నా
కెంత భాగ్యమ్మో.

తనువు మనమును జ్యోతి ప్రాణము
గగనములను నయాచితమ్ముగ
దాన మొసగి దురాశ వీడగ
జేసితివి కృపతో

అలసి సొలసితి కొంతకాలము
లక్ష్యసిద్ధికి కొంతకాలము
వెదకితిని నిర్దయను మ్రోలనె
నీవు దాగితివే.

త్వన్నిరాకరణమ్ముతో నను
ధన్యజీవుని జేసి సతతము
క్షణికవాంఛల ప్రమాదంపడ
నీక ప్రోతువుగా.

## 15

నీదు కీర్తన లాలకింపగ
నేను నీ భవనమ్ము జేరియు
మూల నొదిగితి సంతసముతో
విశ్వభవనమునన్

కార్యరహితమ్మైన నీ జగ
మందనర్థక జీవితమ్మన
వ్రీలిపోయె మదీయకంఠ
స్వరము విష్ఫలమై

ఈ విశాలయములోపల
విస్సు ప్రార్థన సలుపు వేళల
నీదు సన్నిధి నిలిచి పాడగ
నానతిమ్ము ప్రభూ!

కనకవల్లకి నుదయపవన
మ్మందు శ్రుతి సరిజేయు వేళల
నుండ నాసతి నిమ్ము నీ దరి
గౌరవముతోడన్

## 16

జగతి నుత్సవ మందు నా కా
హ్వానమే లభియించినందున
మురిసి తనిసిన నాదు జన్మము
ధన్య మాయె నహో

వీణ మధురముగ నినదించెడు
పాత్ర నిర్వహణమ్ము విందున
నాదు నైపుణ్యము ప్రదర్శిం
చితిని వేడుకతో

దివ్యసన్నిధి జేరి ముఖ సం
దర్శనమ్మువ మౌన ప్రార్థన
నలుపు సమయమ్మునకు నెడనెడ
నిన్ను ప్రశ్నింతున్.

## 17

ప్రియుని కరముల నాడు సర్వ
స్వమ్ము నర్పణజేయు తలపున
నే నిరీక్షించితిని యమితపు
భక్తిశ్రద్ధలతో

మన్నిరీక్షణ వలన కాలవి
లంబనమ్మయి పోయినందున
దోషపూరిత మానసముతో
నిలిచి యుంటినిగా

## 81

న్యాయశాస్త్రపు ధర్మ సూత్రా
వళులతో బంధింప నెంచిన
వారి నందరి ననిశమును ని
ర్లక్ష్యపెట్టితిగా

ప్రజలు నను నిందించి లక్ష్యము
లేని జీవి నటంచు పిలుతురు
ఇట్టి యపవాదమ్ము పరిశీ
లింప నిశ్చయమా

విపణి కాలము ముగిసె ప్రజ తమ
విహిత కర్తవ్యమున కావల
నన్ను పిలిచియు విసిగి వెడలిరి
కుపిత మానసులై

ప్రియుని కరముల నాదు సర్వ
స్వమ్ము నర్పణజేయు తలపున
నే నిరీక్షించితినె యమితపు
భక్తి శ్రద్ధలతో

## 18

కారుమబ్బులు క్రమ్మి చీకటు
లావరించెను ద్వారబంధము
మూల విలిపితి ప్రియతమా! నను
కారణమ్మేమో!

విరతి లేకయె జనులతో మ
ధ్యాహ్న కార్యములందు గడపితి
నీ నిశీధి నిరీక్షణము నీ
దర్శనమ్మునకే.

నీదు దర్శనభాగ్య మీయక
యేకతమ్మున నుంచుచో నీ
దీర్ఘ వర్షానిశాఘటికల
నెటుల గడపుదునో

దృష్టి గగనాంచల విషాద
మ్మందు నిలిపిన మన్మనమ్మె
చలిత పవనపు మేలి ముసుగున
ద్రిమ్మరిల్లెనుగా

## 19

నీవు పలుకగవేని నా హృది
మౌనపూరిత సహనమున నత
యామినీ వదనమ్ము పగిది ని
రీక్షణ మొనర్తున్.

అంధకార మ్మంతరింపగ
నుదయ ముద్భవ మగుట తథ్యము
త్వద్రవమ్మున నరుణ ధుని స
ర్వమ్ము వ్యాపించున్.

నీదు పలుకులు గానమయమై
పులుగు గూండ్లను పర్యటింపుచు
మధురిమను వన సుమగణమ్మున
గ్రుమ్మరించును గా

## 20

అన్యమనమున నుండి పూచిన
కలువ గాంచగనైతి నకటా!
సెజ్జయే సుమరహిత మాయెను
నా యలక్ష్యమునన్

కలత జెందితి మాటిమాటికి
కలల లేచితి కలవరమ్మున
మలయమారుత లలితవీచిక
ననుభవించితినే

మన్మనము నవ్యక్త మధురిమ
మాశతో బాధింప నామని
సఫల మొందగ నెంచు నాత్రపు
శ్వాస యనుకొంటిన్.

నా డెరుంగ ప్రపూర్ణ మధురిమ
మామకస్మృతి సన్నిహిత మని
మన్మనోంతర జనిత కమల ప
రీమళమ్మంచుఁ.

## 21

గడియ లెన్నో గడచె నలసట
వలన నకటా తటమునందే
తథ్య మిత్తరి సాగెదను జయ
వింపగా నౌకఁ

తరువులను పుష్పింప జేసియు
తరలె నామని సత్వరమ్మున
నే నిరీక్షించితిని వాడిన
విరుల భారమునఁ

అలలు సంక్షుభితమ్ములై చెల
రేగె తటద్రుచ్ఛాయలందున
గలగలలతో రాలె నకటా
శుష్కపత్రములుఁ.

శూన్యమున తిలకింతు వేలనొ
అన్యతట మృదుగాన మధురిమ
పవనచలనము తోడ హృదయము
పులకరింపదుగా.

## 22

శ్రావణాంబుద ఘనచ్ఛాయల
నడుగు సవ్వడి లేక యామిని
పగిది నడచుచు వెదకు వారల
కతి రహస్యముగ

ప్రాచ్యపవనారవము వినియును
కనులు దెరువగ నొల్ల దుదయము
నిదుర నెరుగని గగనమున వ
స్త్రాంచలము వెలసె.

గగనసీమల గాన మాగె క
వాటములు బంధింపబడె జన
రహితవాటిక పాంథుడవు నీ
వొకడవే సుమ్మా

నాదు మిత్రుడ వని కుటీర క
వాట మనిశము తెరచియుంచితి
కలల విధమున కరగిపోవక
ప్రియతమా ! రమ్మా.

## 23

కాళరాత్రి నిరాశచే గగ
నమ్మె ఘూర్ణిలు వడి తుఫానున
ప్రణయ యాత్రను బయలుదేరితి
వేలనోయి సఖా !

తావకాగమనమున కెదనెద
తెరతు ద్వారము నిదుర నెరుగక
తిమిరమున నీ జాడ తెలియదు
చోద్య మేమొ సఖా !

ఏయ్యనంత నదీతటమ్మున
ఘోరకాంతారమున దుర్గమ
తిమిరమున బయనించు చుంటివొ
నన్ను జేరంగన్

అనిల మలసిన పులుగు కలరవ
మాపినను దినమంత మందిన
తిమిర వస్త్రాంచలము నాపై
బరుప ప్రార్థింతుజా

పృథివి నిద్రాచ్ఛాదితమ్మయి
నవసిపోయిన కంజదళముల
మంజులమ్ముగ మొగిచి యుందువు
సంజకాలమునజా

జీర్ణమలినాంబరము లందున
కుమిలి క్రుంగిన పధికు గాంచుము
కలువలను రక్షించు విధమున
దివ్యయామినిలో

## 24

నీ పదమ్ముల విశ్వసించుచు
నలసి సొలసిన కాళరాత్రిని
నిర్భయమ్ముగ నన్ను హాయిగ
నిదుర బోనిమ్మా.

సడలిపోయెడు మన్మనోత్సా
హమ్ముతో నీ ప్రార్థనముకై
త్వరితముగ బయనింప నీకు మ
దీయ యత్నమ్ముగ౯

యామినీపటలమున నవసిన
పగటి కనులను పటిలపరచుచు
సుందరానందంపు దృక్కుల
శోభ గూర్తువుగా

## 25

నా సఖుండరుదెంచి సెజ్జను
గూరుచుండిన నొడలు దెలియని
నిదురనుంటిని విధివిలాసము
నా యభాగ్యమున౯

ఆ ప్రశాంత నిశీధి నాతని
కరయుగమ్మున మధురవీణా
రవముతోడుత మారుమ్రోగె మ
దీయ స్వప్నమున౯

అతని శ్వాసలు నాదు నిదుర స్పృ
శించుచున్న త్వదీయ దర్శన
భాగ్యమే కరవాయె రాత్రులు
వ్యర్థ మాయెనుగా

## 26

జ్యోతికై పలుమారు కలవర
మందుచుండెద వెచట గలదని
జ్యోతి వెలిగింపంగ వలె రగి
లించి కామాగ్నిన్

కాంతిరహితమ్మాయె జ్వాలల
చలనమే కరవాయె భ్రమిదను
మృత్యువే శుభదమ్ము మామక
హృదయ వేదనలో

నీ కవాటమ్మున విషాదా
రావములు వినిపించె నీ ప్రభు
డర్ధరాత్రిని ప్రేమ సంకే
తార్థమై పిలిచెన్

గగనమున మేఘమ్ము గ్రమ్మెను
వారి ధార లనంత మాయెను
అంతరార్ద్ర మ్మెరుగ హృదయము
లోని వేదనకుఁ

క్షణము శంపాలతలు మామక
దృష్టిపై బరపెను విషాదము
మన్మనము బర్వెత్తె గానము
కై విభావరిలో

జ్యోతికై పలుమారు కలవర
మందుచుండెద వెచట గలదని
జ్యోతి వెలిగింపంగ వలె రగి
లించి కామాగ్నిఁ.

మేఘములు గర్జిలెను ఝంఝా
మారుతము చెలరేగె జీవిత
ప్రణయజ్యోతిని ప్రజ్వరింపుము
హాయిగా రేయిఁ.

## 27

కఠిన మాయెను బంధములు ఛే
దింప నెంచిననాడు మన్మన
మేలనో వ్యాకులము జెందెన
కారణమ్ముగనే

పలవరించుచు నుందు నిత్యము
స్వేచ్ఛనే హృదయాంతరాళము
గాని నిను వాంఛించు తరినే
సిగ్గు జెందుదునే

సర్వ సంపద భవ్యమయమని
దివ్య మిత్రుడ వనుచు నమ్మియు
విడువ జాలదు తళుకు బెళుకుల
నాదు హృదయమ్ముణా

మలిన సహితము మృత్యుచలిత
మైన వస్త్రము విడువ నైతిని
ద్వేష మైనను సతము గాఢా
లింగన మొనర్తున్

గూఢమై లోపములు బుజభర
మధికమై ప్రార్థింప నెంచియు
వర మొసంగెద వనుచు మదిలో
కరము భయపడుదుర్క్

## 28

మృదులమైన మదీయ సుందర
నామబంధమునందు చిగిసిన
జీవినై దుఃఖించుచుండెద
నేకతమ్ముగనే

సతము ప్రాకారమ్ము గట్టితి
గగన చుంబితమాయె కుడ్యము
మరుగువడె తచ్ఛాయలందు మ
దీయ రూపమ్మే

మఱుగు పఱుపగ నాదు నామము
గర్వమున దృఢపఱుతు కుడ్యము
పోల్చనైతి నిజస్వరూపము
శ్రద్ధచే నేమో !

## 29

ప్రణయ సంకేతార్థమై బయ
నించితిని నేకాంతముగ న
న్నీ ప్రశాంత నిశీధి నెవరో
వెంబడింత్రు సుమీ

వివిధ పథముల వక్రగతులను
బిరబిరా పయనింప నెంచితి
నతని గికురించెడు నుపాయ మ
సాధ్య మాయెనుగా

డంబములు బింకములతో భువి
ధూళి రేపి మదీయహంకా
రమ్ముతో శ్రుతి గలుపు సతము ప్ర
తిధ్వనింపంగన్.

లజ్జ నెఱుగని మామకాహం
కారమే సాకార మాయెను
తద్విధమ్మున నిన్ను దరియగ
సిగ్గిలుదు స్వామీ !

## 30

శృంఖలల దగిలించి కరచర
ణమ్ములను బంధించి వైచియు
నదయతను చెరసాల నుంచిన
దెవ్వరో చెపుమా

విశ్వమున నైశ్వర్యము న్నధి
కారముల నార్జించుతలపున
నా ధనాగారమ్ము నించితి
స్వామి సంపదలన్

నిదురబోయితి ప్రభువు శయ్యను
మేలుకొన కోశమ్మె కారా
గార మాయెను విధివశమ్మున
ప్రభువు బంధించెన్

శృంఖలల దుర్భేద్యముగ నొన
రింప రన్యులు మత్కృత మ్మది
అహరహమ్మును శ్రద్ధతో ని
ర్మించితిని ముదమున్.

ఇయ్యె జేయపు శక్తితో వి
శ్వమ్మునే బంధించి స్వేచ్ఛను
గోరి సతతము శృంఖలల ని
ర్మించి యుంటివిగా

కౌక్కిళ్ముల బిగియించి దృఢమగు
సంకెలల నిర్మించి చూచితి
మత్కృతమ్మున నేనె శాశ్వత
బంధముల నుంటిఁ

## 31

మోహపాశావళుల నను బం
ధింప నెంచిరి విశ్వమున నీ
ప్రేమ దైవాన్వితము స్వేచ్ఛా
న్వితము నా స్వామీ!

మరతు నని యెడి వెరపుతో నను
విడువ సాహస మందరే నీ
దర్శనము కరవాయె దినములు
గడచు చిత్రముగఁ.

వతము నిను ప్రార్థింప కున్నను
నిలుపకున్నను హృదయమున నీ
ప్రేమ నా ప్రణయమ్ముకై ని
త్యమ్ము వీక్షించుచు

## 32

ఉదయమున ప్రప్రథమముగ మా
నిలయమున కరుదెంచి వారలు
గేహమందలి స్వల్పభాగ
మ్మొయ వేడిరిగా

పూజలందు సహాయపడుచు ప్ర
సాదమున భాగమ్ము గోరియె
మూల నొదిగిరి సాధువాక్కుల
దీన వదనములన్

ఆలయమ్మున కాళరాత్రిని
నిర్భయమ్ముగ జేరి నైవే
ద్యమును దోచె దురాశచే నప
విత్ర హృదయమునన్

## 33

నీవె నా సర్వస్వ మని మది
నమ్మితిని నీ దివ్య పదముల
నాదు లేశాహంకృతిని క్షమి
యింపుమో స్వామీ !

నిన్ను గని సర్వత్ర హృదయము
ప్రేమతో నర్పింతు సతము వి
వేక దృష్టిని నిర్మలమ్ముగ
బరపుమో స్వామీ

దివ్యజీవనబంధముల ప్రే
మాదరమ్ముల జూపవే భవ
దాశయము నెరవేరు నీదగు
ప్రణయ బంధాజ్ఞన్

## 34

స్థైర్యధైర్యమ్ములును దివ్య
జ్ఞాన సహితాదర్శ విశ్వము
సత్యవాక్పరిపూర్ణక్రియ నవ
తర్కమార్గమ్మున్

మనోగాంభీర్యమ్మతో న
భ్యుదయభావ విశాల స్వర్గ
స్వేచ్ఛమై నాదేశమును మే
ల్కొలుపగదె స్వామీ!

## 35

ప్రభువరా! నా హృదయమున దౌ
ర్బల్య మెటులనొ ప్రబల మాయెను
సత్వర మ్మరుదెంచి నిర్మూ
లింప ప్రార్థింతుఁ

కష్టసుఖముల నేకదృష్టి భ
రింపగల ధైర్యమ్ము వేడెద
వేడెదను సత్సేవకై స్థై
ర్యమ్ము నతిప్రేమఁ

దీనులను దరిజేర్చు భాగ్యము
దుర్మతుల నిర్జించు ధైర్యము
మన్మనముః దృఢపరుచు వరమును
ప్రసాదింపగదే

స్థైర్యమున నతిప్రేమతో నీ
చరణ సన్నిధి నాదు సర్వ
స్వమ్ము నర్పణజేయ ధైర్య
మ్మిమ్ము నా స్వామీ !

## 36

శక్తి తరుగక యాత్ర ముగియును
వస్తు సంచయ మంతమౌన
జ్ఞాతముగ సమయమును జేరుట
తథ్యమని తలతుఁ.

స్థిరముగా త్వచ్ఛక్తి మన్మన
మందు సతతము సవ్యవాక్కున
నవపథమ్ముల నద్భుతమ్ముల
జూపునని తలతుఁ

## 37

భవచ్ఛరణమె సర్వదా శర
ణమ్ముగా తపియించు నా హృది
కామవాంఛల కలత లన్నియు
మిధ్యయే సుమ్మా.

యామినీ హృది కాంతికై విన
తులను తమమున దాచు విధమున
కలవరింతు ప్రమత్తతను త్వ
చ్చరణ సన్నిధికై

దారుణాహతి కాంతి నపహర
ణమ్ము జేసి ప్రశాంతి గోరు తు
ఫాను పగిది శ్రమించు హృది నీ
దర్శనమ్మునకే

## 38

మన్మన మ్మూర్ధ్వత దొలంగియు
కఠినతరమగు సమయమున నీ
కరుణరస వర్షామృతము దయ
చేయుమో స్వామీ !

నరస మృదుతర జీవనము రస
హీనమగు నెడ దివ్యగానా
మృతముతో విచ్చేసి నను ర
క్షింపుమో స్వామీ !

బాహ్య విశ్వభయంకర ధ్వని
వేరుపరచెను ఘోషచే నను
శాంతమూర్తీ! త్వరితముగ వి
శ్రాంతి గొని రమ్మా

నాదు దైన్యము హృదయమున నొక
మూల నొదిగెను సత్వరమ్ము క
వాటమును భేధింపరమ్మా
రాజస మ్మొలుకఁ

బ్రాంతి మలినము లేకముగ మ
న్మనము కామాంధమున గ్రమ్మిన
అప్రమత్తత జ్యోతి హేతుల
జూపుమో స్వామీ !

## 39

శుష్క హృదయము దినదినమ్ము కృ
శించె దిక్చక్రమ్ము నిర్మల
మాయె జలదావళులు నను కరు
ణింప వాయెనుగా

భీతిదమ్మగు కాలమృత్యువు
పెనుతుఫానున బరపి రోదసి
ఘనతటిద్ఘాతమున ఝళిపిం
పంగదే స్వేచ్ఛగ

హృదయ సంక్షుభితాతప స్మృతి
క్రూరవర్తన నోప జాలను
సత్వరము కరుణించి శమియిం
పంగ ప్రార్థింతుగ

జనకు నాగ్రహదినము కంకణ
లోచనమ్ముల జనని పగిదిని
నీ కృపాజలదమ్ముతో ర
క్షింపుమో స్వామీ !

## 40

నీడ దాగెద వేల ప్రియతమ
సరకుజేయక సాగిపోయెద
రందరును నిను పథమునం గల
ధూళి ద్రోయుదురే

పత్రపుష్పావళుల నిను న
ర్చించ నుంటిని పథికులే నా
కుసుమముల గొనిపోవ సెజ్జను
విరులు లేవాయెఁ

ఉదయ మధ్యాహ్నములు గడచెను
సంజకాంతుల నలసె కన్నులు
పథికు లెల్లరు నగవుతో జన
సిగ్గు నందితినే

ఏమి గావలె నన జవాబుల
నీయ నొల్లక నుంటి భిక్షుకి
పగిది వస్త్రాంచలము నాచ్ఛా
దించి వదనమ్ముఁ

నే నిరీక్షించినది భవదా
గమనమున కని తెల్పుదును సి
గ్గగును దారిద్ర్యమ్ము నీ క
ర్పింప ధైర్యమునఁ.

తృణము నడుగిడి కాంతు తేజో
గమనమున నీ స్వప్నగగనము
దివ్యకాంతుల నరుణకేతన
మనిల వీచికలన్

తేరు దిగినను దరిని జేర్పగ
వడకితిని జీర్ణాంబరమ్ముల
అనిలమున కంపించు లతవలె
నవవసంతమువన్

కాలహరణము గల్గె రథచ
క్రముల సవ్వడి వినగ నైతిని
ఉత్సవమ్ముల జయధ్వానము
లెన్నియో గడచెన్

వారివెనుక ప్రశాంతముగ నిలు
చుండి రెవరో స్వామి సతము ని
రీక్ష జేతువు దుఃఖపూరిత
హృదయ భారమునన్

## 41

కర్ణముల బడె ప్రభాతమ్మున
అన్యు లెరుగక మనము నౌక న
పారయాత్రను తరలవలె న
జ్ఞాత భువి కనుచుణ

అయ్యపారమహోదధిని పద
రహితగాన తరంగముల మా
ధుర్యమును దరహాసమున గ్రో
లెదు ప్రశాంతముగణ

సమయ మాయెను పనులు ముగియవె
సంజ చీకటు లావరించెను
ఖగ గణమ్ము కులాయముల దరి
యంగ విచ్చేసెణ

ఎపుడు బంధము సడలునో దిన
కరుని చరమ జ్యోతివలె తిమి
రమున నంతర్ధానమగు మా
నౌక సత్వరముణ

## 42

రాక నెరుగను ముదముతో నా
హ్వాన మీయగ నైతి శాశ్వత
ముద్ర నుంతువె ప్రచలజీవిత
ఘటికలను నాకై

నేడు తిలకించితిని నీ హ
స్తాక్షరమ్ములు మలినమై గత
కిష్ట సుఖములు క్షణికమై చి
త్రమ్ముగా చెదరెఁ

ధూళిలో శైశవ క్రీడల
సంతసింతువు తారకావళి
మారుమ్రోగు మదీయపాద
స్పందనము క్రీడఁ

## 43

ఎండవానల దివ్యనాట్యము
గ్రీష్మ వర్షావళుల గతులను
పదములను తిలకింతు ననిశము
నేత్రపర్వముగా

సవ్య వార్తాహరుల గమనా
గమనముల తిలకింతు పథమున
మలయమారుతమందగమనా
నంద భాగ్యమునన్

దినము సర్వము ద్వారసన్నిధి
కూరుచుని వీక్షింతు ముదమున
త్వరితముగ నరుదెంచ నెంచిన
మధుక్షణమునకై

గాన మాలాపింప దరహా
సమ్మతో నేకతము సుందర
మందమారుత దివ్యమధురా
మృతము గ్రోలితిగా

## 44

ఆలకింపగ లేదె యాతని
నడి నెరుంగని పదముల ధ్వని
అనుక్షణ మరుదెంచు నాతడు
సర్వకాలమ్మున్.

చిత్తవృత్తిని వివిధరీతుల
నాలపించితి కీర్తనల నం
గీతనాద మ్మతని యాగమ
నమ్మునే తెల్పున్

గ్రీష్మ పరిమళమందు విపిన ప
థమ్ములో నరుదెంచె శ్రావణ
జలద భయద రథమ్ములో నరు
దెంచు నదురేయిన్

నాదు దుఃఖ పరంపరల త
త్పాదఘట్టన వలన నా హృది
ధన్యమాయెను దివ్యచరణ
స్పర్శకాంతులలో

**45**

ఎన్నియుగముల నుండి నను దరి
జేర నుంటివొ నే నెరుంగను
నిన్ను రవి తారకలు దాచగ
లేవు గద స్వామీ !

నీ పదధ్వని నుదయ సాయం
త్రముల ననిశము వింటి వార్తా
హరుడు నా హృదయమ్ము నే మే
ల్కొలిపె గోప్యముగఁ

నే నెరుంగను కారణము నా
ప్రాణమే చలియించె నేడే
మధుర హృదయానంద సంభ్రమ
ప్రాప్త మెందులకో

కార్యమును ముగియించు సమయ
మ్మైన యటులనె తలతు ననిల
మ్మందు భవమధురామృతమ్మే
ననుభవింతునుగా

## 46

రాత్రి జాగరణమ్ము నలసితి
నుదయమున నిద్రించుతరి నత
డరుగుదెంచిన నిరోధింపగ
వలదు సఖులారా !

అతని మృదుపద పంకజమ్ముల
సవ్వడికి మేల్కొననిచో నా
నా నిదుర జెరుపగ వలదు నెచ్చెలు
లార ప్రార్థింతుఁ

పక్షిగణముల ధ్వనులకు న్మద
యోత్సవమ్ముల పవనములకును
నిద్రలేవను నాదు ప్రభు దరు
దెంచినను తుదకుఁ

నిదుర విడివడి నేత్రములు వి
ప్పారు నాతని స్పర్శకును దర
హాసమునకును నిదురలో వ్యా
పించు కలలవలెఁ

అతని దృక్కులు ప్రకంపింపగ
నిమ్ము నాతని ప్రబుద్ధాత్మను
ఆత్మ సన్నిధి జేరుటయె ప్రభు
జేరుటగుగాదే

## 47

ఉదయ శుక పిక శారికలు పథ
మందు సుమములు జలదములు వ్యా
పించు కాంచన దివ్యకాంతుల
ప్రకృతి శోభించెఁ

గాన మెరుగ ప్రయాణ మెరుగము
పలుకులను దరహాస మెరుగము
త్వరితగతి బయనించితిమి కా
లానుగుణ్యముగఁ

అలసె పక్షులు శుష్కపత్రము
లెగిరె నిదురించితిని తృణమున
ఆతపమ్మౌన ఛాయలో గో
పాలకుని భాతిఁ

నన్ను హేళన జేసి మిత్రులు
వివిధ నగ దేశాళి భూముల
గడచి యంతర్ధాన మందిరి
నీలి మబ్బులలో

ధీరదూషణ హేళనల మే
ల్కాంచనైతిని మధుర దైన్యా
నంద లలితచ్ఛాయ నభినం
దించితిని వారిఁ

చిత్రవర్ణపు విషచ్ఛాయలు
హృదయమున వ్యాపించ సర్వము
నింద్రజాల విధానమున క
ల్పించితిని వేడ్కఁ

నిదుర లేవగ భవద్దర్శన
మాయె దరహాసమ్ముతో ; నిను
జేరు మార్గమె దూరమని వెత
జెందితిని స్వామీ !

## 48

దివ్య భవనమ్మున మహా సిం
హాసనము దిగి నా కుటీర క
వాటసీమను నిలిచితివి నా
కెంత భాగ్యమ్మో

ఏకతము పాడితిని గానా
మృతముకై విచ్చేసి ముదమున
నా కుటీర కవాటసన్నిధి
నిలిచియుంటివి గా

నీదు మందిరమందు నిపుణులు
నిరతమును కీర్తించినను సా
మాన్య కంఠ మదీయగీతము
నాదరించితివే

మేళవించె విషాదగీతము
విశ్వగానముతో సుమమ్ము బ
హూకరింపగ నిలిచితివి నా
ద్వార సన్నిధినే.

## 49

గ్రామ వీధుల భిక్ష కరిగితి
దూరమున స్వప్నమ్మువలె నీ
రథము గాంచితి ముదముతో రా
జేంద్రు డనుకొంటిఁ

ఆశ పెరుగ దరిద్ర బాధ తొ
లంగునని వీక్షించి భిక్ష న
యాచితమ్ముగ సంపదల గురి
యింతు రనుకొంటిఁ

రథము దిగ నీ వదనమున చిరు
నగవు నాపై చెంగలింతువె
నా యదృష్టము పండెనని భా
వి చి పులకింతుఁ

కరము జూపి తటాలున నె నే
నీయగలిగిన భిక్ష మడిగెదు
యాచకుని యాచించు ప్రభువది
యెంత చిత్రమ్మో !

సంశయమ్మున జాగు చేసితి
సంచియందగల ధాన్యమును పిడి
కిలిని నీ కర్పణము గావిం
చితిని వేడుకతో

సంచిలో గల పసిడి తునకల
సంజకాంతుల గాంచి దుఃఖిం
చితిని సర్వస్వమ్ము నర్పణ
జేయనందులకై

## 50

తిమిర మధికమ్మాయె కార్యము
లెల్ల ముగిసెను అతిథు లెల్లరు
నరుగుదెంచి రటంచు భావిం
చితిమిగా రాత్రిఁ

ద్వారములు బంధింపబడగా
ప్రభువు రావలెననియె నొక్కడు
పరిహసించితి మాతనిని స
త్యేతర మ్మంచుఁ

ద్వారమందలి ధ్వనులు వినబడ
పవనఘాతము లనెడి. తలపున
దీప నిర్వాణమ్ము తదుపరి
విదురబోతిమిగా

అడుగు సవ్వడివలన వార్త
హరుడు వచ్చెనటంచు తెలుపగ
పవనచలన మ్మంటిమే పరి
హాస భావమునన్

అర్ధరాత్రికి గాఢ నిద్రను
ధ్వనుల వింటిమి యురుము లంటిమి
భువి చలించెను భిత్తికలతో
నిదుర లేచితిమే

చక్రముల ధ్వను లనిరి కొందరు
ప్రళయమేఘుని గర్జనలుగా
తలచియుంటిమి కలవరింతల
నిదుర మైకమునన్

చిమ్మచీకటులందు భేరీ
ధ్వనులలోన ప్రబోధము విని
హత్తుకొంటిమి హస్తముల హృద
యముల కతిభీతిన్

అదియె ప్రభువరు కేతనమ్మని
తెలిపె నొక్కఁడు నిలువబడితిమి
సమయమే లేదాయె నాల
స్యమ్ము సలుపంగన్

అరుగుదెంచెను ప్రభువరేణ్యుఁడు
జ్యోతులే లేవాయె ; మాలలు
లేవు ; సింహాసనము లేదే
తుద కధిష్ఠించన్

సిగ్గు జెందగ వలదు లేమికి
శూన్యగృహమున రిక్తహస్తా
వళుల నాహ్వానింపుడని ముద
మారగా దెల్పెన్

తెరచి ద్వారము శంఖ మొత్తు డ
గాఢ తమమున ప్రభువు నిర్జన
గేహమున కరుదెంచె ఘనగ
ర్జనల కాంతులతో

జీర్ణదర్భాసనము మన గృహ
ప్రాంగణమ్మున పరచు డనియెను
పెనుతుఫానున భయదరాత్రిని
ప్రభువు విచ్చేసెన్

## 51

నీ గళమ్మున మాలలోని గు
లాబి నడుగ నధైర్యమున నుద
యమున నీ పయనమ్ము తదుపరి
వెదకితిని శయ్యన్

నేను భిక్షుకివలె నుషస్సు గు
లాబిరేకుల వెదుక ఖడ్గము
భీతి గొల్పెను దివ్యమగు వ
జ్రాయుధము పగిదిన్

ఉషఃకాంతిని శయ్య దరియగ
నుదయ విహగము ముదితరో నీ
కేమి లభ్యమ్మాయె నని ప్ర
శ్నించెగా నన్నున్

పుష్పములు గంధములు లేవే
లేదుగా పన్నీటి పాత్రిక
నీ భయంకర దివ్యఖడ్గమె
దర్శన మ్మాయెన్

తలతు చిత్రపు కాన్క విషయము
దాచనోప ధరింప నోల్లక
అబల నైతిని హృదయమున నే
హత్తుకొన జాలన్

ఐన నిదియె భవత్ప్రసాదము
గౌరవమ్ము విషాదభరితము
మోద మలరగ హృదయమందున
దాచుకొందునుగా

నాకు భయ మిక లేదు విజయుడ
వీవె నా రణమందు; సఖునిగ
జేసితివి మృత్యువును నభిషే
కింప ప్రాణములన్

బంధములు ఛేదింపగా భవ
దీయఖడ్గమె చెంత నుండగ
నిర్భయమ్ముగ నుందు ముదమున
విశ్వజీవమునన్

పిగ్గు సింగారముల బాధల
మోదముల వీడెదను నీ ది
వ్యాయుధమె సద్భూషణము ప్రా
ణేశ! సతతమ్మున్

## 52

తారమణిమయ రత్నభూషిత
దివ్యసుందర హస్తరాజము
సర్వదా శుభదమ్ము స్వామి త్వ
దీయహస్తమ్మే

వైనతేయుని పక్షవిలస
త్కాంతి తుల్యము ఖడ్గరాజము
సంజకాంతుల దివ్యతేజ వి
లాస సహితమ్మున్

మృత్యు ఘాతమ్మున ప్రకంపిత
ప్రాణి పగిది త్వదీయ ఖడ్గము
ఐహికముల దహించు జ్వాలా
సహిత తేజమునన్

తారమయ భవదీయ హస్తము
ఖడ్గమా భీతిదము సతతమ
చింత్యమౌ వరుణేశు లీలలు
చిత్రములు గాదే

## 53

వరము లడుగను తెలుపలేదు మ
దీయనామము నీదు గమనము
పిదప నిలిచితి మౌనముగ నే
కాంతమున ఛాయన్

తోయభాండావళుల మగువలు
పిలిచినను మధ్యాహ్నమైనను
జాగు చేసితి నసందిగ్ధపు
భావడోలికలన్.

దీనదృకుక్కుల హీనరవమున
తృష్ణతో పథికుండ నంటివి
అంజలిని జలధార వోసితి
తత్తరము తోడన్

పత్రములు చలియించె ముదమున
కూసె కోయిల తమమునందున
పరిమళించె కదంబకుసుమము
పథసమీపమునన్

నామ మడుగగ సిగ్గు పడితిని
మౌనపూరిత హృదయ భరమున
జ్ఞప్తి నుంచుకొనంగ నేల మ
దీయ నామమ్మున్

తృష్ణ దీర్చిన మధుస్మృతి హృద
యమున దాచితి జాము దాటెను
పక్షు లలసెను వేపపత్రము
లురలె వీక్షింపన్

## 54

నీదు హృదయ మ్మలసె సత్వర
గతిని తావక లోచనమ్ములు
స్వల్ప నిద్రాపూరితములై
భార మనిపించెన్

కంటకమ్ముల మధ్య పుష్పము
శోభతో రాజించు పెరుగవె
వ్యర్థ పరుపక కాలమును మే
ల్కొనుము సత్వరమే

కఠిన శిల మార్గాంతమున నే
కాంతసీమను నా సఖుండే
నిరీక్షించెను మేలుకొ మ్మ
న్యాయ పరుపకుమా

మధ్యదినమున సూర్యరశ్మికి
నవసె గగన మ్మధిక శ్వాసను
సైకతస్థలి తృష్ణ వస్త్రము
బరపె – ఫలమేమో !

హృదయమున సంతసము నందవె
మార్గవల్లకి మధురగాన
మ్మాలపించదె బాధతో నీ
పాదఘట్టనలన్

## 55

సంతసమ్మున మన్మనము పరి
పూర్ణ పరతువు కృపను స్వర్గా
ధీశ! నే లేకున్నచో నీ
ప్రణయ మేమగునో

సంపదల నా కిచ్చి పగమును
వాదు హృదయ మ్మందనంతా
నందమున నా జీవికకు రూ
పమ్ము నిత్తువుగా

హృదయమును వశపరచుకొన మో
దమున సౌందర్యమ్ముతో న
న్ననుసరించుట పాడియగునా
నీకు రాజేంద్రా!

నీదు ప్రేమ త్వదీయ ప్రియు ప్రణ
యమున లీనముగాగ నుభయుల
ప్రణయమే పరిపూర్ణమగు నై
క్యమ్మునను సతమున్

## 56

సర్వ విశ్వవ్యాప్త కాంతీ!
సర్వ నేత్రానంద దాత్రీ!
మధురహృదయాధార దివ్య మ
దీయ సత్కాంతీ!

ప్రేమతంత్రుల మీటి నా హృది
కాంతి నాట్యమ్మాడ గగనము
విరిసె నసిలము వీచె దరహా
సమ్ము ధర జేరెన్

చిత్రవర్ణపు కీటకమ్ములు
రెక్కలార్చె నఖండకాంతిని
జలజములు మల్లియలు కాంతి త
రంగముల నూగున్

మేఘమాలిక లందు చెదరిన
పసిడికాంతులు ప్రజ్వలించును
వ్యర్థముగ వెదజల్లు మణులను
ప్రియతమా ! కనుమా

అగణితానందమున పరవశ
మాయె పర్ణమూహ మనిశము
గగన గంగానందమున ను
ప్పొంగి వ్యాపించున్

## 57

ధరణి తృణజాలాంకురమ్ముల
తృప్తి నొందగ జేయు మోదము
జననమరణ సహోదరుల నా
డించు విశ్వమునన్

పెను తుఫానున నూది జీవుల
దరహసింపగ జేయు మోదమె
అరుణకమల విషాదమున క
న్నీట నర్తించున్

తనదు సర్వస్వమ్ము ధూళిని
నించు నజ్ఞానమున మోదము
వివిధ గతుల విలీనమగు న
త్యంత గీతమునన్

## 58

ఓయి నా హృదయేశ్వరా! స
ర్వమ్ము నే గ్రహియించితిని నీ
కరుణ వర్షామృతమ యన్యము
గాదు నిశ్చయమౌ

అరుణకాంతులు పత్రములపై
నాడె నింగిని ఘనునివలె నని
లమ్ము వీచె మదీదహృదయా
నంద మువ్పొంగెన్

ఉదయకాంతి మదీయదృక్కుల
నిలుపు నీ సందేశమునకే
కలిసి చూపులు మానసము త్వ
త్పదములను జేరెన్.

## 59

ఇయ్యనంత విశాల జలనిధి
విశ్వతటమున బాలు లాడిరి
స్థిరము గగనము సంద్రమే చలి
యించె వేగముగన్

సైకతస్థలి నాడి పాడిరి
పండుటాకుల పడవలను పయ
నింప జేసిరి బాలకావళి
ముదిత మానసులై

ఈత నెఱుగరు వలల విసరరు
గులకరాళ్ళను ప్రోగుజేతురు
గుప్తధనమును గోరనేరరు
బాలకులు సతమున్

జాలరులు ముక్తాఫలమ్ముల
గోరి జలధుల మున్గుచుందురు
వర్తకులు బయనింతు రనిశము
జలధి యానమునన్

జలధి నగవున పొంగగా తట
మందు తళుకులు నింద బాలలు
ఆటలాడిరి ముదముతోడ స
ముద్రతటమందున్

మృత్యుసహిత తరంగతతులే
వ్యర్థగీతము లాలపించెను
బాల నూపుచు జోల బాడెడు
మాతృమూర్తివలెన్

చెలగె ఝంఝూమారుతము; సం
ద్రమున నౌకలు భగ్నమై విహ
రించె మృత్యువు ముదము నించెను
బాల సంఘమ్ముల్

# 60

కిన్నరగ్రామమున మిణుగురు
పుర్వులను ముకుళముల నుండెడి
నిదుర పసిపాపలను ముద్దిడ
వచ్చెనందురుగా

బాలబింబాధరముపై చిరు
నగవు చిందును ముదము గూర్చను
దాని జన్మస్థానమున కొక
గాధ గలదనిరే

విదియ చంద్రుని లలితకాంతుల
శరన్మేఘాంచలము నంటి తు
షార దివ్యస్వప్నమున దర
హాస ముదయించెన్

మృదులమై అతిమధురమై బా
లాంగముల సుకుమారమై విల
సిల్లు నవ్యత గ్గా విధమును
తెలియగా ముదమౌ

మాతృదేవీ యౌవనమ్మున
హృదయమందలి శోకమార్యము
ముగ్ధమోహన శాంత రూపము
కారణమ్మగుగా

## 61

బాల్యక్రీడా చిత్రవస్తు చ
యమ్ము గాంచుచు జలదతతులను
పుష్పవర్ణ విచిత్రముల గ్రహి
యింతు నతిప్రీతిన్

పత్రగీత తరంగరావ
మ్మాలకించెదు ధరణి హృదయ మె
రింగితిని నా గానమున నీ
నాట్యభంగిమ కై

ఆత్రమున ఫలహారములు దన
పూవుదేనియ జ్ఞప్తి గలుగున
గుప్తఫలరస చిత్రముల న
త్వరము గ్రహియింతున్

ఉదయకాంతుల గగనవాహిని
నామనిని పవనమ్ము మోదము
గూర్చు నెరిగితి నీ ముదమ్ము మ
దీయ చుంబనమున్

## 62

దివ్యదర్శన భాగ్యమున పరు
లెల్ల నా సఖులైరి నా కా
హ్వాన మాయెను దూరదేశ వి
భిన్న గేహములన్

నవనివాసము జేర నా మన
మేలనో పరితాప మందును
సర్వమును భవదీయ మను విష
యమ్మె మరచితిగా

జననమరణావళుల నను లో
కముల బహువిధ జీవితమ్ముల
ద్రిప్పెదవు సతతమ్ము దివ్యా
నంద బంధములన్

సర్వవిదుడవు సర్వమయుడవు
నీదు పరమానంద దివ్య
స్పర్శకై ప్రార్థింతు నను ర
క్షింపుమో స్వామీ!

## 63

కాంత నేకాంతమున తృణ జా
లమున దీపకతో నదీతటి
జేర వేడితి దీపికను మ
న్నిలయమున నుంచన్

సంజకాంతిని దివ్యవదనము
తోడ సుందర దృక్కులను ప్రస
రించి తెల్పెను భామినీమణి
మధుర వాక్కులతో

ఇనుడు క్రుంగగ దీపికను వా
హినిని వదలెద ననెను తరగల
తేలియాడెడు దీపికను తిల
కించితిని వేడ్కన్

ఆ ప్రశాంత నిశీథి నర్థిం
చితిని నా గృహతమము బాపగ
సుదతి దీపిక గగనమున కం
కిత మొనర్తు ననెన్

కాళరాత్రిని తమము బాపు మ
టంచు వేడగ భామినీమణి
క్షణమునను తిలకించి పల్కెను
అంధకారమునన్

దివ్య దీపోత్సవముతో న
మ్మోద మందెద నవెను మానిని
వ్యర్థమగు దీపికను తిలకిం
చితిని చిత్రముగన్

## 64

నిండె సర్వము నాదు జీవన
పాత్ర పొరలగ నుండె సర్వే
శ్వరున కభిమతమైన మధురా
మృత మ్మెది యౌనో

కవివరా! నీ సృజనమును నా
కర్ణసీమల నిలిపి గానా
మృతమునే గ్రోలెదు ప్రశాంతి నే
వంతమోదమ్మా

నా మనమ్మున భవ్యమయమగు
దివ్య విశ్వము కవిత లల్లుచు
నీదు మధురానందమే సమ
కూర్చు గానమ్మున్

వ్యయముగా నీ సర్వమును నా
కర్పణము గావించి ప్రేమను
అనుభవింతువు ముదముతో నా
మధుర జీవమునన్

## 65

క్షణిక కాంతుల మిణుకులందుద
యమున వస్త్రాంచలము నుండెడి
అంతరాత్మను గానమున వ
ర్ణింతు సంతతమునన్

మధురవాక్కులు ప్రణయవాంఛను
తెలిపి విఫలమ్మాయనే తుది
యత్నములు కరచాలనముకై
నిష్ఫలమ్మాయెన్

హృదయసీమను వదిలపరిచితి
ద్రిమ్మరిలి దేశముల ననిశము
ఆత్మపరిధుల జీవనము సుఖ
దుఃఖముల నుండెన్

క్రియలలో భావములలో నా
నిదురలో స్వప్నమ్ములో నధి
కారముద్ర వహించినను దూ
రమ్ముగనె మసలెన్

ఆమె కొరకై నా కుటీర క
వాటమున కరుదెంచు వారలు
అతి నిరాశను వెడలి పోయిరి
చిత్రముగ స్వామీ !

విశ్వమున ప్రత్యక్షముగ వీ
క్షింపగా లేదెవ్వ రామెను
ఏకతము వీక్షించు మీదగు
దర్శనమ్మునకై

# 66

సకల గడన మనంత నీడా
కృతిని దాల్చిన దివ్యమూర్తివి
ముగ్ధమోహన రూపమున బం
ధించితివి నన్నున్

పూలసెజ్జను గొని ప్రభాతము
ధరణి నభిషేకింప సుందర
మాలికల మోదమున గొనియె ప్ర
శాంత సమయమునన్

శాంత జలధిని తోయ భాండము
శిరముపై నిడి కరము శ్రద్ధను
పథ విహీన తృణమ్ము వెంబడి
సంధ్య యరుదెంచెన్

విస్తరిలె గగనమ్ము దశదిశ
లాత్మ సతము పరిభ్రమింపగ
దివ్యసీమను ధవళకాంతులు
వ్యాప్త మొనరింపన్

పగలు రాత్రులు లేని రాజ్యము
రూప వర్ణాతీత దేశము
వాఙ్మయమ్మే లేని రాజ్యము
స్వర్గ రాజ్యమ్మున్

## 67

సూర్యరశ్మి మదీయగేహ క
వాటమున దినమెల్ల గతపె వి
షాద కంకణగాన మేఘా
వళుల వీకియన్

జలద వస్త్రాంచలముతో వ
క్షమ్ము నాచ్ఛాదించి బహు ళం
గులను దివ్యానంద వర్ణ
మ్ముల హసింతువుగా

మృదులమైన భవద్దుకూలము
వివిధ వర్ణ విచిత్ర సహితము
దివ్యతేజము శాంతరూపము
వాంఛనీయమ్మే

నీ భయంకర ధవళకాంతిని,
దైన్యమౌ ఛాయతో నాచ్ఛా
దింతువే సతతమ్ము మోదా
వహుఁడవై స్వామీ !

౬౯

అనిశమును నా రక్తనాళ
మ్ముల వహించెడు జీవవాహిని
తాళలయ సంగీత యుతమౌ
విశ్వ నాట్యమునన్

జీవవాహిని భూజమై దశ
వితతి సతతము వ్యాప్తమై తుం
దుడుకు దనమున పర్ణసూన త
రంగ ఘాతమ్మౌ

కడలి తరగలపగిది నవిశము
జీవవాహిని జనన మరణ
మ్ములను ముదమున నూచు చిత్ర
మ్ముగను నా స్వామీ !

ఉజ్జ్వలమ్మగు నా శరీరము
విశ్వజీవ స్పర్శచే గ
ర్వమున రక్తమునందు ప్రాణ
స్పందనము గలిగెన్

## 69

తాళలయ సంతోషగతుల ము
దమ్ము నందుట భవదధినమె
భయదమోదావహాహ్లాదనై ఉయ
నింప సాధ్యమ్మె

సర్వవస్తుచయమ్ము పయన
మ్మగును తరలెడి జీవవాహిని
నిరోధించెడు శక్తి భువిలో
లేదు పరికింపన్

తరలె ఋతువులు తాళలయ సం
గీతనాట్య విధానమున జని
క్షణిక సుఖ సంపూర్ణ వాహిని
లోన నశియింపన్

## 70

నా యహంకారమున దశదిశ
లెల్ల వ్యాప్త మొనర్చి వివిధ
చ్ఛాయలను ప్రసరింతువే జే
జమ్మనే మాయన్

అవధులను కల్పించి నిర్దయ
వేయి భంగుల పిలుతువే ది
వ్యాత్మ కల్పిత విభజనమె నా
రూప మాయెనుగా

గీతమే తీక్ష్ణమ్ముగా గగ
నమున ఘూర్ణిలె విచిత్రముగ నీ
యాత్మ కపజయ మాయె నాలో
స్థిరముగా స్వామీ!

అహోరాత్రుల తెర చక్కని
యవనికను చిత్రించి యద్భుం
తరమునసె దివ్యాననము కూ
ర్పించితివె నీకై.

గగనమున మన యుత్సవము వ్యా
పించు మన గానమ్ము ననిలము
నూచు యుగములు గడచు క్రీడా
వళులతో మనకున్

## 71

ఆహారహమ్మును శ్రద్ధతోడ ర
హస్యముగ స్పృశియించి నను మే
ల్కొలిపినది దివ్యాంతరాత్మ మ
దీయ హృదయమునన్

మంత్రమున నా కనులు గప్పి ము
దమ్ము మీరగ హృదయ తంత్రుల
మీటి సుఖదుఃఖారవమ్ముల
వాలపించునుగా

నీలహరిత సువర్ణ రజత వి
చిత్ర మాయాయవనికాంతర
దివ్యచరణ సరోజముల తిల
కించి మైమరతున్

తరతరమ్ములు తరలె నా హృద
యమును దోచెడు వివిధ రూపా
ఖ్యాళిలో సుఖదుఃఖమయమో
దావహమ్మననే

## 72

సర్వదా వైరాగ్యమున మో
క్షమ్ము వలదు స్వాతంత్రమును స
హస్రబంధానందమున వాం
ఛింతు సత్వరమున్

వివిధ పరిమళ వర్ణముల మధు
ధారలను వర్షించి పరిపూ
ర్ణ మ్మొనర్తువు నాదు మృణ్మయ
పాత్రనే సతమున్

శతవిధమ్మగు దీపికల నా
విశ్వమున నీ జ్యోతితో వెలి
గించి పూజ లొనర్తు నాలయ
దివ్య పీఠమునన్

నాదు జ్ఞానేంద్రియ ద్వారా
వళుల బంధ మొనర్ప స్పర్శ
శ్రవణదృష్టులు సతము భవదా
నందమునె చిందున్

జ్వలిత సర్వభ్రమలె దీపో
త్సవముగా మోదమ్ము గూర్చెను
వాంఛలే పరిపక్వమై పూ
జాఫల మ్మిచ్చెన్

## 73

దినము ముగియగ నరుణ సంధ్యా
కాంతు లలమె విశాల ధరణిని
సమయమాయె మదీశకలశము
నింపగా నదిలో

పవన వేగమువలన జలము వి
షాదరవమున పిలిచె నిర్జన
వాటికను చిరుగాలి తరగల
మంటి నేకతమున్

మరలి వచ్చెదు విషయ మెరుగక
యన్య మెరుగక నుంట పోపా
వమ్ముకడ వాయించె వీణియ
నెవ్వరో నొకన్

## 74

మర్త్యులకు నీ వొసగు వరములు
మాదుమమతం దీర్చి తదుపరి
త్వత్పదమ్ముం జేరు సతము ప్ర
పూర్ణ భావమునన్

అహర్దినమ్మును నదులు విధులను
గ్రామసీమల నెరపి నిరతము
దరియుగద త్వత్పాదముల ప్ర
క్షాళనము జేయన్

అనిలమును మధురించి కుసుమము
త్వత్పదమ్ముల గొలువ త్వరపడు
వృద్ధిగాంచును జగము నీ పా
దార్చనమ్మువనే

కవికృతమ్మగు పదములకు వివి
ధార్ధములు వివరింతు రిలలో
నంతరార్థము తుదకు నీ ది
వ్యార్థమునె చూపున్

## 75

అనుదినమ్మను ప్రాణనాధుని
సమ్ముఖమ్మున నిలిచి ముకుళిత
హస్తముల నుతియింతు లోకే
శ్వరుని సతతమ్మున్

ఈ ప్రశాంత విశాల గహన
చ్ఛాయ నేకాంతమున నమ్రత
నతశిరమ్మున నిలిచితిని నీ
సమ్ముఖమ్మున నే

అధిక వేదన నున్న నీ వి
శ్వమున వివిధ శ్రామికుల సం
దోహమున నీ సమ్ముఖమ్మున
నిలిచియుంటినిగా

విశ్వమున విధ్యుక్త ధర్మము
ముగియగనె నేకాంతముగ నీ
మ్రోల నిలుతు ప్రశాంతముగ ని
శ్చయము రాజేంద్రా

**76**

నాదు దైవమ్మనెడి సద్భా
వమున దూరమ్మందు నిలిచితి
నెరుగ కాత్మీయుండ వని స
న్నిధికి రానైతిన్

తండ్రివని భావించి సాష్టాం
గ ప్రణామ మొనర్తు ముదమున
సఖునిగా భావించి కరచా
లనము జేయ సుమీ

నీ పథమ్మున నిలిచి నిత్యము
ప్రాణ సఖుడను భావమున నిను
గాఢముగ నాలింగనము జే
యంగ లేను సుమీ

సోదరుల గణియింప నైతిని
నీవు నా సోదరుడవని సం
పాదనముతో వెడలితిని మన
మనుభవింపంగన్

కష్టసుఖముల లోన నీదరి
జేరుదును ప్రాణమ్ము నర్పణ
జేతు జీవితజలధిలో మును
గంగ నే నొల్లన్

## 77

నవ్యసృష్టికి తారకలు వెలు
గంగ నాకసమందు సురసభ
ముదము జెంది ప్రపూర్ణ చిత్ర
మ్ములను తిలకించెన్

తార చెదరెను కాంతి హారము
మధ్య వ్రీలె నటంచు సభలో
తెల్పె నొక్కడు సమరసమ్మున
సత్వరమ్ముగనే

గాన మాగెను స్వర్ణతంత్రీ
భగ్నమున భయమంది వారలు
విగత తారనె గగణమణిగా
భ్రాంతి జెందుదురే

నాటితో నన్వేషణము సం
పూర్ణ మాయెను తారకై సత
తమ్ము సర్వజనాళి వీడెనె
ముదము విశ్వమునన్

వ్యర్థమగు నన్వేషణము సం
పూర్ణ మాయెను కాంతిహార
మ్మనె ప్రశాంత నిశీధి తారలు
దరహసము తోడన్

## 78

దివ్యదర్శన మొదవ నందున
బాధ నందగ నీయవలదు వి
షాద బాధ భరింప నిమ్మా
స్వప్నమందైనన్

విశ్వవిపణిని జనులతో నా
లాభగణనము వ్యర్థ మనుమా
బాధలను భరియింప నిమ్మిక
స్వప్నమందైనన్

అలసి సొలసి శ్రమించి పథమున
ధూళితో శయనించు తరి నా
దీర్ఘయాన మను క్షణమ్మును
మరువనీకు ప్రభూ !

వేణు మంగళనాద బహుధా
లంకృతుల దరహాసముల నిను
మరచు వేళల బాధ నొందగ
నిమ్ము నా స్వామీ !

## 79

ద్రిమ్మరిలు మేఘమ్మువలె నే
నుంటి నను రక్షింపు భాస్కర
దివ్యతేజ విలీనవాంఛను
నే నిరీక్షింతున్

క్రీడయే ముదమైనచో నా
రిక్తహృదయము స్వీకరించి వి
చిత్ర పవన తరంగముల వ్యా
పింప జేయగదే

ఈ విభావరి క్రీడ ముగియగ
నిచ్ఛగించెదవేని స్వామీ
కరిగి పోవుదు ముదముతోడ న
దృశ్యమగుదు సుమీ

ధవళకాంతి ప్రభాతమున దర
హాస నిర్మల శీతలమ్మున
కరగి ముదము నదృశ్య మగుదును
స్వామి నీ కొరకై

## 80

వ్యర్థమగు కాలమునకై వి
శ్రాంతి పరితపమందితిని క్షణ
మెల్ల సార్థక మాయె భవహ
స్తముల చిత్రముగన్

బీజముల నంకురములుగ ముకు
ళముల పుష్పమ్ములుగ కుసుమ
మ్ములను సఫల మొనర్చితివి హృద
యాంగణమ్మున నే

అలసి నిదురించితిని విధులు ము
గించినట్లు తలంచి వీక్షిం
చితిని నే నుదయమున నుపవన
వివిధ కుసుమాళిన్

## 81

అవధి రహిత మ్మాయె కాలము
సతతమును నీ దివ్యకరమున
కాలగతి గణియింప మర్త్యుల
శక్తులే స్వామీ !

సౌరభము వెదజల్లి కుసుమము
ధూళి రాలెడు రీతి యుగములు
గడచిపోవ ప్రతీక్షజేతు వ
వంత రూపుడవై

తరలి చనునెడ తరతరమ్ములు
కరుణతో వనసూనమును పరి
పూర్ణతను గలిగింప మధువును
ప్రసాదింతు వహో!

కాలహరణము కలుగనీయము
లక్ష్యసాధన గలుగు వరకును
నే భరింపగ జాల క్షణ మా
లప్యమైన సుమీ

పరుల ననిశము తృప్తి పరుపగ
గడపితిని కాలమ్ము నైవే
ద్యమ్ము శూన్యమ్మాయె పీఠము
తుదిని బరికింపన్

ద్వారములు బంధింతురని నే
నాత్రమున నడుగిడితి దర్శన
భాగ్యహీను నటంచు కుందితి
వ్యవధి గల దింకన్

## 82

జననికంఠ మలంకరింప వి
షాద కంకణ తతులగూర్చి
ధవళతమ ముత్యాల సరమును
భక్తి నర్పింతున్

కాంతిమంజీరముల తారలు
పాదపద్మ మలంకరింపగ
హృదయసీమను తేలియాడు మ
దీయహారమ్మే

భవదధీనము సిరులు గనుకను
నా యధీన విషాద మెల్లను
కానుక లీయ ననుగ్రహింతు వ
మూల్య వరములతో

## 83

ఈ వియోగ మ్మధిక వేదన
తోడ విశ్వవ్యాప్తమై బహు
రూపముల ప్రభవించు సతతమ
నంత గగనమునన్

ఈ ప్రశాంత నిశీధి తారల
జూచి దుఃఖాన్విత వియోగము
వర్షరాత్రిని చరితపల్లవ
మధురగానమౌ॥

మానవావళి మధురబాధలు
మోహవాంఛలు వ్యాప్తి నందగ
మధురభావ తరంగ కవితా
రీతు లుదయించున్

## 84

ప్రభువు భవనము వీడినప్పుడు
యోధు లెచ్చట శక్తి దాచిరి
కవచముల వివిధాస్త్రముల నె
చ్చోట నిడివారో

నిస్సహాయత దీనవదనుల
పైన గురియగ బాణవర్షము
మరల త్వరపడి ప్రభువు జేరిరి
గుప్తశక్తులకై

ఖడ్గముల త్యజియించి శాంతిని
గోరి జీవఫలాల వీడిరి
ముదముతో తమ ప్రభువు భవనాం
గణము జేరంగన్

## 85

మృత్యుదేవుడు నీదు భృత్యుడ
గాధ జలధుల నధిగమించెను
దివ్యసందేశమ్ము గొని నా
గృహము కరుదెంచెన్

అధికభయమున కాళరాత్రిని
జ్యోతి గొని ద్వారములు తెరచి న
మస్కరించితి స్వాగతమ్ముగ
నీదు భృత్యునకున్

హస్తములు ముకుళించి కంకణ
నేత్రపూజ లొనర్చి మృత్యువు
పాద సవ్నిధి మోద మలరగ
హృదయనిధి నుంతున్

కార్యమును సాధించె మృత్యువు
తిమిరమున నేకాకి నైతిని
నిస్సహాయత తుదిని నీ కా
త్మార్పణము జేతున్

## 86

ఆశ నెఱుగని మధుర వాంఛను
వెదకితిని గేహమ్ము సర్వము
నామె జాడయె గాంచనైతిని
శ్రమ ఫలింపదుగా

నా కుటీరము స్వల్పమైనది
గనుక తరలినవారు పిమ్మట
మరలివత్తు రటంచు దెలుప న
సాధ్యమగు నాకున్

నిఖిలమైన త్వదీయ భవన
మ్మతివిశాలము గనుక నామెను
వెదుక నిలిచితి స్వామి నీ గృహ
ద్వార సన్నిధినే

సంజకాంతిని పసిడిష్టందిట
నిలచితిని తన్మయుడనై నీ
వదనమును తిలకింప నాత్రము
తో నిరీక్షింతున్

శాశ్వతస్థలి దరిని జేరితి
మోదమును వాంఛలును కంకణ
వదనదృశ్యము లచట నంత
ర్ధాన మందవుగా

నా నిరర్థక జీవితమ్మున
గాఢజలధిని మగ్నపరపుము
విగత మధుపరిపూర్ణ విశ్వ
స్పర్శ గననిమ్మా

## 87

ఆలసింపదు భగ్నవల్లకి
ఘంట మ్రోగదు మౌనియగు పవ
నమ్ము శిథిలాలయములో గల
స్వామి నర్చించన్

ద్రిమ్మరిలి లోకమ్ము నర్వము
తరలె నిర్జన దేవళమ్మున
కామనిని పవనుండు పరిమళ
కుసుమరహితుండై

భగ్నమనమున ద్రిమ్మరిల్లుచు
వర్చకుడు దేవళము జేరును
నంజచీకటి నాకటంబడి
హృదయభారమునన్

పర్వదినములు మౌనముద్రను
పర్వులెత్తును భజన రాత్రుల
తుదకు దీపారాధనము కర
వాయెగద స్వామీ

అమరశిల్పుల విగ్రహమ్ములు
కాలవాహిని గలిసె జీర్ణా
లయస్వామిని గొలువరే ని
ర్లక్ష్యభావమునన్

# 88

ప్రభువు నాజ్ఞను మౌనముగ సం
కేతముల భాషింతు సతము ర
హస్యగీతావళుల జరుగును
హృదయ భాషణమే

రాజవిపణిని జనము త్వరపడి
జేరె బేహారమునకై మ
ధ్యాహ్నమున నా కాజ్ఞ యాయెను
కార్య మధ్యమునన్

వనమునందు నకాల పుష్ప
మ్ములు లభింపగ నిమ్ము భృంగ
మ్ములు ప్రమత్తత గాన మాలా
పించనిమ్ము ప్రభూ

కాలహరణము గలిగె సదస
ద్భావదృష్టిని సఖుడు పిలిచెను
వ్యర్థదినములు నా మన మ్మా
కర్షణ మ్మాయెన్

## 89

మృత్యుదేవత నీ గృహమ్మున
కరిగా నరుదెంచు క్షణమున
అతిధి నెవ్విధి నధికశ్రద్ధను
సత్కరించెదవో

నాదు ప్రాణప్రపూర్ణ పాత్రిక
నతిధి కర్పణజేతు ముదమున
అతిధి నెన్నడు బోవనీయను
రిక్తహస్తములన్

వివిధ ఋతువుల గొనిన మధువుమ
జీవితైశ్వర్యమ్ము సర్వము
నర్పణము జేసెదను జన్మాం
తమున మృత్యువుకున్

## 90

జీవితపు పరమావధివి దిన
దినము నీ యాగమనమునకై
మృత్యువా సుఖదుఃఖముల భరి
యించి వీక్షించున్

గోప్యముగనె మదీయ సర్వ
స్వమ్ము నీ సన్నిధిని జేరె న
పాంగదృష్టికి నాదు ప్రాణము
నీ యధీనమ్మౌ

మాల సిద్ధమ్మాయె వరునకు
వధువు కళ్యాణాంతమున తన
విభునితో బయనించుగద నే
కాంతముగ రేయిన్

## 91

భువిని వీడెడు నాదు స్థితి ప్రా
ణమ్ము పటలము కనులపై నిడి
నిర్గమించు ప్రశాంతినను విష
యముల నెరుగుదుగా

తారకలు మేల్కాంచు రేయిని
ఉదయమగు తద్విధిని గడియలు
కష్టసుఖముల వీడు సేతు త
రంగముల గతి నే

జీవితపు తుది గడియలను నే
తలచి పరిశీలించు క్షణమున
క్షణిక పటలము వ్రీలిపోవును
తునియలై స్వామీ !

మరణకాంతులవలన నీ వి
శ్వమ్ములో నిర్లక్ష్య విధులను
అధమనీచ విధానరహిత
మ్మని గ్రహించితిగా

వాంఛలవశిష్టములు నిత్య మ
యాచితమ్ముగ లభ్యములు స
ర్వమ్ము గతియించినను నే వాం
ఛింపబోను సుమీ

నాదుపదఘట్టనల నలిగియు
హీనమని త్యజియించి వైచిన
వాని గోరెద త్రికరణమ్ముగ
ప్రసాదింపగదే

## 92

నిర్గమమున కనుజ్ఞ యాయెను
సోదరుల వీడ్కోలు వేడెద
వీడెదను లోకమును నే నం
త్యప్రణామమునన్

విడచితిని సర్వాధికారము
గేహమును గైకొనుడు కృప, నా
ప్రార్థనము నంగీకరింపుడు
కరుణ వాక్కులతో

మీ సమీపమ్మున వసించితి
హాయిగా సుఖియించి మించితి
నాదరమునకు పాత్రమాయె మ
దీయ జీవమ్మే

దీపనిర్వాణమున తిమిర
మ్మావరిల త్వరితముగ నాజ్ఞా
పనముచే సంసిద్ధమైతిని
కాలగమనమునన్

జీవితపు తుది గడియలను నే
తలచి పరిశీలించు క్షణమున
క్షణిక పటలము వ్రీలిపోవును
తునియలై స్వామీ !

మరణకాంతులవలన ని వి
శ్వమ్ములో నిర్లక్ష్య విధులను
అధమనీచ విధానరహిత
మ్మని గ్రహించితిగా

వాంఛలవశిష్టములు నిత్య మ
యాచితమ్ముగ లభ్యములు స
ర్వమ్ము గతియించినను నే వాం
ఛింపబోను సుమీ

నాదుపదఘట్టనల నలిగియు
హీనమని త్యజియించి వైచిన
వాని గోరెద ప్రతికరణమ్ముగ
ప్రసాదింపగదే

## 92

నిర్గమమున కనుజ్ఞ యాయెను
సోదరుల వీడ్కోలు వేడెద
వీడెదను లోకమును నే నం
త్యప్రణామమునన్

విడచితిని సర్వాధికారము
గేహమును గైకొనుడు కృప, నా
ప్రార్థనము నంగీకరింపుడు
కరుణ వాక్కులతో

మీ సమీపమ్మున వసించితి
హాయిగా సుఖియించి మించితి
నాదరమునకు పాత్రమాయె మ
దీయ జీవమ్మే

దీపనిర్వాణమున తిమిర
మ్మావరిల త్వరితముగ నాజ్ఞా
పనముచే సంసిద్ధమైతిని
కాలగమనమునన్

## 93

చెలులు శుభకాంక్షలను గొని ప్ర
స్థానముకు వెడలితిని సుందర
గగనవీథిని నుషఃకాంతుల
లలిత మార్గమునన్

వివరముల నడుగకుడు నే గొని
పోవు కానుకలమూల్యములు నా
హృదయమే వాంఛాప్రపూర్ణము
రిక్తహస్తమ్ముల్

కంఠమున కళ్యాణహారము
నుంతు కాషాయాంబరమ్ములు
వలదు పథము ప్రమాదమైనను
మన్మనము స్థిరమే

మత్ప్రయాణాంతమున తారా
సహిత దివ్యవిషాద గీతము
మధురరవమున రాజమార్గము
నందు మ్రోగెనుగా.

## 94

జీవితమ్మను ద్వారబంధము
గడచితిని తన్మయుడనైతిని
ప్రథమదర్శన మధుక్షణమును
మరచి యుంటినిగా

అర్ధరాత్రిని విపినమున పు
ష్పించు కుసుమము వగిది మాయా
లోకమునను బడద్రోసి యుంచిన
దెవ్వరో చెపుమా

పరిచయ మ్మనిపించె నుదయ
మ్మందు విశ్వము మాతృదేవీ
రూపమందు ననంతరూపుడు
లాలనము జేయన్

మృత్యుముఖమున పరిచయమ్మగు
రూపరహితుని గాంచి నంతన
మందితిని జీవనము మరణము
మోదమగు నాకున్

స్తన్యమును సేవించు శిశువును
మాతృదేవి మరల్చ నేడ్చును
మోదమందును మరల స్తన్య
మ్మీయ సత్వరమే

**95**

నిర్గమించెడి వేళ నా వీ
క్షణము భువిలో నిరుపమాన
మ్మనెడి నా తుది పల్కులను శా
శ్వతము జేయగదే

కాంతిజలధిని కమలమందున
గుప్తమధువన తృప్తిపడితిని
ధన్యమాయె మదీయజీవన
మంటినే తుదకున్

క్రీడనుండి యనంతరూపా
వళుల సహితమ్మైన గృహమున
రూపరహితుని గాంచితిని కను
లార సన్నుతితో

భువి స్పృశింపగ రాని దివ్య
స్పర్శచే పులకించె సర్వాం
గములు నవసానమ్ము సంప్రా
ప్తింప హర్షింతున్

## 96

ఎవరివని ప్రశ్నింపనైతిని
జీవితము క్రీడామయమ్మై
జ్ఞానరహితమ్మైన నా దుం
దుడుకుదనముననే

అనుదినమ్ము ప్రభాతమున నను
నిదుర లేపుచు సఖునివలె వన
భూములను ద్రిమ్మరిల జేతువు
మోద మలరంగన్

బాల్య చాపల్యమున నీ గా
నార్థ మెరుగ నశక్తిచే సాం
దర్యనాట్య విధానమున ను
ప్పొంగె మన్మనమున్

క్రీడ ముగియ ననంత దృశ్యము
విశ్వవీక్షణ తారకలు త్వ
త్పాదపద్మ సమీపమున విన
యమున నుతియింతున్

## 97

కేతనము హారము పరాజయ
చిహ్నముగ నర్పించుకొందును
అపజయ మ్మెఱుగకయె నుండ న
సాధ్యమగు నాకున్

అహంకార మ్మంత మగునని
ప్రాణబంధ మ్మధిక బాధల
త్రెళ్ళిపోవు నటంచు నిక్కము
గా నెఱుంగుదుగా

శూన్య హృదయ విషాదగీతము
వ్యర్థ వంశీరవమువలె దుః
ఖించి పాషాణమ్ము నే క
న్నీట కరగించెన్.

కమలమున శతదళసమూహము
సర్వదా ముకుళించి యుండదు
ఏకతమ్మున నున్న మధువు బ
యల్పడును తుదకున్

నీలి నింగి ననంతనేత్రము
రమ్మనెను ధర యాత్ర ముగియగ
తథ్యమగు నా చరమదశ నీ
పాదసన్నిధినే

## 98

సర్వభరము వహింతు వీవని
తరుణమున చుక్కాని వదలితి
వ్యర్థమగు రభసమ్ము విధ్యు
క్తమ్ము సఫలమౌ

హృదయమా భరమెల్ల విడువుము
అపజయము నంగీకరించి ప్ర
శాంతజీవన సౌఖ్యమున సం
తృప్తితో మనుమా

అనిలచలనము వలన నిర్వా
ణమ్ము పలుమరు గలుగ త్వరపడి
దీపికను వెలిగించి విధ్యు
క్తమ్ము మరచితిగా

సర్వమును త్యజియించి దర్భా
సనము తిమిరము నందు పరచితి
స్వేచ్ఛకై రమ్మిటకు స్వామి ప్ర
శాంతముగ రేయిన్

# 99

దివ్యజలధి నగాధ తమమున
మున్గితిని నా కోరికలనా
కారరహిత పవిత్ర సాకా
రంపు ముత్యముకై

పవనఘాతమ్మైన నౌకను
స్వేచ్ఛమై బయనించి తరగల
తేలియాడెదు దినము లంత
మ్మామయెగద స్వామీ!

అనిశమును ఆతురత జెందుచు
సంతసమున పరిభ్రమించితి
నమృతసీమల నంత మొందెదు
మహద్భాగ్యముకై

ఈ విశాల సభాంగణమ్మున
నాదరహితమ్మైన తంత్రీ
గాన మాప్పొంగగ గ్రహింతును
హృదయ వల్లకినే

శాశ్వత స్వర మాలకింపగ
శ్రుతుల గట్టి విషాద గీతాం
తమున నుంతు ప్రశాంత పదముల
మ్రోల వల్లకినే

# 100

అనిశమును సంగీత మధురిమ
నూత గొని దిశలెల్ల వెదకితి
విశ్వమెల్ల స్పృశించి దివ్యా
న్వేషణమ్మునకై

గానమున జ్ఞానోదయమ్మై
ధర్మమార్గ రహస్య మెఱిగితి
దర్శన మ్మయె హృదయసీమను
దివ్యతారకలున్

ఇహ సుఖమ్ముల దుఃఖముల ర
హస్యముల బోధించి గానము
దివ్యభవన ద్వారమే స్థిర
వాస మనె సజన్

## 101

జనులతో భాషించు తఱి నే
ని న్నెఱుంగుదు నని ప్రగల్భము
లాడియుంటిని పెక్కుమారులు
ముదము గలుగంగన్

నాదు రచనలలోన నీ చి
త్రమ్ములను తిలకించువారలు
ఎవరివని ప్రశ్నింప నేమని
తెలుప గలుగుదునో

తెలుపజాల నటంచు బల్కిన
తెగడుచుందురు జను లసూయను
సర్వమును తిలకించితివి దర
హాస మెలయంగన్

నీదు గాధ లనంత గీతా
వళుల జేసి మదీయ హృదయము
త్వరితముగ ప్రవహింప జేసె ర
హస్య వాహినులన్

భావమును వివరింప లేనన
పరిహసించిరి పృచ్ఛకులు నీ
మ్రోల నవమానింప నను గని
దరహసించితివే

## 102

అంత్యసాష్టాంగ ప్రణామ
మ్మున స్పృశింపగ నిమ్ము నీ పద
వ్యాప్తమగు విశ్వమును మత్స
ర్వేంద్రియమ్ములతో

జలభరమ్మున నతశిరమ్మగు
శ్రావణమ్మున ఘనునివలె నీ
ద్వారమున నమ్రనముతోడ ను
తింప నిమ్ము ప్రభూ !

నాదు కవితను వివిధగీతము
లేక ధునియై మౌన జలధిని
లీనమై ప్రవహించు సాష్టాం
గప్రణామమునన్

వివిధముగ బయనించి ఖగములు
స్థిరగృహమ్ముల జేరునట్లు మ
దీయ జీవ మనంతసీమల
జేరు మన్నతితో



జి. వి. యన్. ప్రింటర్స్, చీరాల ఫోన్ : 208